Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి - పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

జనపాడు.

సంపుటము 18 | 1927 సం॥ మార్చి నెల. | సంచిక 12

విషయములు.

1 ఆంధ్రసారస్వతము - ద్రోణంరాజు సీతారామారావుగారు.
2 ధర్మజిజ్ఞాస, ధర్మస్వరూపము - దంటు శ్రీనివాసులుగారు బి.ఏ.,బి.ఎల్.
3 దస్యులనగా నెవరు - కనుపర్తి మార్కండేయులుగారు.
4 గ్రాంథిక వ్యావహారిక భాషావాదతారావళి - త్రిపురాన వెంకట సూర్యప్రసాదరావుగారు.
5 నాగరఖండము - సంపాదకుఁడు

చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి, మహబూబునగరంజిల్లా.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, గార్ల, మానుకోట తాలూకా.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రామసింగుగారు—నెల్లుట్లహాపురసంస్థానముల మేనేజరు— నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకటశేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు,
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్రయ్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మూగ్గంపాడు.
౬ శ్రీరామయ్యాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు— నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, వసీదుపల్లె.
౧౩ ఓకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౫ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఇంగోలు.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకోండూరు
౧౮ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు-శాతాపురం
౧౯ కోత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రులుగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్య గారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, కుంటుపల్లి.
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగాచార్యుల రంగయ్యగారు, నర్సారావుపేట



# అభినవసరస్వతి


సంపుటము ౧౮ { జానపాడు / జయ సం॥ ఫాల్గుణమాసము. } సంచిక ౧౨


## ఆంధ్రసారస్వతము.

చాళుక్యవంశవర్ధనుఁడగు రాజరాజనరేంద్రుని యాస్థానమున జన్మించి నన్నయభట్టుచేఁ బలుకులు నేర్పఁబడి, తిక్కన యెఱ్ఱాప్రెగ్గడాదులచేఁ బెంపఁబడి, రెడ్డిరాజ్యము జేరి శ్రీనాథాది కవుల ప్రాపు గాంచి శైశవము గడపి, యాంధ్రకవితా పితామహాద్యనేక కవిదిక్కుంభినీ సంభరితాచ్ఛ యశశ్చంద్రికా నికర సంశోభితమగు శ్రీకృష్ణదేవరాయల యాస్థానముఁ జేరి యీడేరి, తన యెనలేని హొయలున నెల్లర నామోదింపఁ జేసిన యాంధ్రకవితావధూటింగూర్చి యించుక చెప్పఁదలఁచితిని.

ఈ కాలమునఁ బ్రబంధరచన తగ్గిపోయినది. విద్వత్కవులగు కొందఱెవ్వరైన రచించియుండినను మొత్తముమీద ప్రబంధనిర్మాణాసక్తి నశించినదనియే నుడువఁదగును. ఇప్పటి కవులలోఁ జాలమంది తమబుద్ధిని నాటక నవలారచనములయందుఁ బ్రవేశపెట్టుచున్నారు.... "కాలము మారినట్లే భాషగూడ మార్పు బొందవలయుననియు, గ్రంథములు గ్రామ్యభాషలోనే యుండవలయు" ననియు కొందఱు వాదమునకుఁ గడఁగిరి. ...

**నాటకములు:**—ఈకాలమున నాటకరచన విశేషముగనున్నది. వాని యందు శాశ్వతముగ నిలుచునవి కొన్ని మాత్రమే యుండునని చెప్పవచ్చును. భాషాంతరీకరణములు కొన్ని, స్వతంత్రరచనలు కొన్ని, ఎక్కడఁజూచినను నాటకములే. ఉన్నవన్నియుఁ బ్రదర్శింపఁబడుచుం

డుటలేదు. అమూల్యములగు నాటకములు మూలనే పడియున్నవి. ప్రదర్శించువారు తమ కనుకూలమగుదానిని గైకొని, పది పార్శ్వకర్నాటపు మట్లు గలిపికొని ప్రదర్శించుచు పామరుల మెప్పుబొందుచున్నారు. కాని యిప్పుడున్న నాటకములలో నేదియుత్తమమో, యేదిరసభరితమో, యేది నీతిబోధకమో తెలిసికొని ప్రదర్శించుటలేదు. ఇదియుంగాక, తద్రచనావిధానముగూడ గొంత కొఱతవడియున్నది. పురాణముల నుండియో, చరిత్రము నుండియో, లేక యే కథల నుండియో యొక కథ నెత్తుకొని నాయకీ నాయకులఁ గల్పించి, వారికిదోడు నాలుగు పాత్రలతికించి, వ్రాసినంతమాత్రముచేత నాటకము కానేరదు. నాటకములు చదువుటవలనగాని, ప్రదర్శనములు చూచుటవలనఁగాని ప్రజలహృదయములలో నొక విధమయిన భావము లుదయింప వలయును. జపానుదేశమున దేశాభివృద్ధి నొందించుటకును, దేశీయాదర్శముల నుపదేశించుటకును, దమ దేశమున ఖ్యాతిగన్నమహాపురుషుల జీవితచరిత్రములు మొదలగునవి నాటకరూపముగాఁ బ్రదర్శించుట కలదు. కావున సరళము, రసాత్మకము, అనతిదీర్ఘము, సలాక్షణిక కవిత్వవైభవోపేతము, భావోద్రేకపూరితమునగు నాటకము లింకను మన దేశమున రచియింపఁబడవలయును. ఇప్పుడున్న నాటకములఁ గూర్చి యెంతయైన వ్రాయవచ్చుగాని యిందు స్థలము చాలదు. ...

<u>వచనకావ్యములు:</u>—మధురతరమగు మన యాంధ్రసారస్వతమున వచన గ్రంథములు చాలినన్ని లేవు. ఆదికవులందఱు గ్రంథరచనము, పద్యములయందె గావించియున్నారు. పూర్వకవులు ధర్మశాస్త్రాదులు సైతము వచనమున వ్రాయక గణయతిచ్ఛందోబద్ధములగు పద్యములతోనె ముగించియుండుటచే వచనరచనమునం దాకాలమున గౌరవము మిగులఁ గొలఁదిగనున్నదని భావించవచ్చును. ఆంధ్రవాఙ్మయమున వచన గ్రంథములు పూర్వకవులు కొలఁదిగ వ్రాసి

యున్నారు. చరిత్రాంశముల బోధించు గ్రంథములు వచనమున నుంటయే యుక్తము. చరిత్రాంశములకు గవితాశిల్పము లనవసరములు. పరిశోధనమె ముఖ్యము. నిర్దుష్టముగానుంటయు, సరసము, సుబోధము నగు భాషలో వ్రాయబడుటయు గ్రంథప్రాశస్త్యమునకు సాధనములు. ఈ ధర్మరహస్యము నెఱిఁగియే తొల్లిఁటి కవులలోఁ గొండఱు దండకవిలెలు, ప్రతాపచరిత్రము, రాయవాచకము, కయిఫీతులు మొదలగు చరిత్రగ్రంథములు వచనములో వ్రాసినారు. ఇప్పుడు మనకుఁ జరిత్రగ్రంథములు పూర్తిగ లేవు. ... ... ...

హరికథలు:— హరికథలనిన మనవారు చులకనగఁ జూతురు. ఆంధ్రసారస్వతచరిత్రమునందు వీనికి స్థానమిచ్చి తీరవలయును. నాటక ప్రదర్శనములవలన జనులహృదయములెట్లు నానారసనిమగ్నములగు చుండునో, యట్లే హరికథాశ్రవణమువలనఁగూడ నగుచుండును. వీని యందుఁగూడ పాత్రౌచిత్యము, రసము, శబ్దమాధురి మొదలగునవి యుండవలయును. ఏదో కొంచెము పాడఁగలశక్తి నలవఱచుకొని హరిదాసులమని చెప్పుచు, నుదరనిమిత్తమై పాండిత్యము పూజ్యమైనను నాలుగుకీర్తనలను, రెండు తోహరాలను, పదిపద్యములను వ్రాసి హరికథలఁ జెప్పువారి గ్రంథములఁగూర్చి ప్రశంసింప నవసరము లేదు.

ఆంధ్రదేశమున హరికథకులలో శ్రీయుతనారాయణదాసుగారు, బాలాజీదాసుగారు మొదలగువారు ముఖ్యులైయున్నారు. నారాయణదాసుగా రుభయభాషాపాండిత్యముగలవారు; సంగీతసరస్వతులు. వీరి హరికథలయందు హరికథకుఁ దగిన రసము, పాత్రౌచిత్యము మొదలగునవి సాధ్యమగునంతవఱకుఁ బోషింపఁబడినవి. బాలాజీదాసుగారును కవులే. హరికథలు చెప్పుటలో మంచిపేరు సంపాదించినారు. కాని వీరి హరికథలఁగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. వీరు పదములకూర్పును, తాళము చిత్రగతులనడచుటయును ప్రధానముగఁ జూచిరేకాని,

పాత్రపోషణమునకుఁ ప్రాముఖ్యత యిచ్చుచున్నట్లు దోచదు. సీతా కల్యాణమున, శ్రీరాముఁడు సీతను చూచినసందర్భమున "అబ్బబ్బ" యను నొకకీర్తనలో ఆరాముని మదనావస్థలో ముంచివేసినారు. శాంతగుణప్రధానుఁడు, నప్పటికి బదియారేండ్ల బాలుడును నగు నా రాముని పాత్ర కిట్టిది కల్పించుట దోసమనియె నాయభిప్రాయము. రాముఁడుధీరోదాత్తుఁడు. మఱియొకవిషయము:— వీరిస్త్రీవర్ణన వింతగనుండును. ఏనాటికథను మనము వ్రాయుదుమో, యందలి పాత్రల యాచారములు మొదలగునవి యాకాలమునకే సరిపోయియుండవలయును. ఒకచోట వీరు "ఆహా యలవియె దానిసోయగము... తను రుచి-డైమండ్ లైట్......— రైటు"—అని వర్ణించినారు. ఇందు అందముకొఱకు హూణపదములు జేర్చినారు. ఒకవేళ నిట్టికీర్తనలు పామరుల కామోదము గొల్పినను బండితులు మెచ్చరు. గ్రంథములు కేవలము పామరులకొఱకేగాదు. వీరి లేఖిని శృంగారవర్ణనమున కెక్కువగ పరువెత్తును. హరికథలయందంత శృంగారమనవసరము. 'హరికథ' యనిన నర్థమేమి? భక్తిరసమునకు ప్రాముఖ్యతయిచ్చి తక్కినరసములు తదనుగుణముగా బోషించుచుఁ పాత్రౌచిత్యమును గమనింపవలయును. శ్రీబాలాజీదాసుగా రిట్టివికనిపెట్టి,యింకను చక్కని హరికథావాఙ్మయ మాంధ్రులకర్పించి వారి కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక !

రైలువాఙ్మయము:— చిల్లరపుస్తకములకు "రైలువాఙ్మయ" మని యాంధ్రపత్రికయందు వసంతలేఖాలేఖకులు పేరుపెట్టియున్నారు ఆపేరు సార్థకమైయుండుటచే నేను దానినే వాడితిని. ఆడంగులముచ్చట్లు, రైలుచిత్రము, అంతాగమ్మత్తు, ప్రయివేటువకీలు, కథలకామరాజు తన్నులు, ముద్దు, ఇద్దరుపెళ్లాలయిబ్బంది, ముసలిమగడు-పడుచుపెండ్లాము, రూపాయగమ్మత్తు, గణపతిగత్తర, మూధాకవళంమల్లాయ, తల్లికి మొగుడు, కబుర్లకాలం, ఎడంచేతిదెబ్బ, తుడికాలుతన్నులు, తొపామర

పా, ఇంకను ననేకవిధములయిన చిత్రవిచిత్రనామములతో చిన్నపుస్త కములు బయలు దేరినవి. ఇవియన్నియు నొకగాలికిఁ బుట్టి వేరొకగాలికి నశించు పురుగులవంటివని చెప్పవచ్చును. భాషాభివృద్ధికీగ్రంథము లేమియు దోడ్పడజాలవు గావున నాంధ్రసారస్వతచరిత్రమునం దివి విస్మరింపఁబడవలసిన వే.

విమర్శనగ్రంథములు:— ఇవి మనలో లేవు. భాషాభివృద్ధి కివి మూలముగావున నిట్టివి బయలు వెడలవలెను. భాషాభిమానులును, గవులును నిందులకుఁ బూనుకొని యాంధ్రసారస్వతవధూటి కమూల్యా లంకారములఁ గూర్చెదరుగాక! ... ... ...

# ధర్మజిజ్ఞాస: ధర్మస్వరూపము.

సూ॥ "అథాతో ధర్మజిజ్ఞాసా"

మన శాస్త్రములన్నిటిలోను ప్రస్తుతకాలమున అనేకకారణ ములచే తిరస్కరింపబడుచున్నది ధర్మశాస్త్రము. సామాన్యజనులంద రును ధర్మశాస్త్రమనగా జాతాశౌచమును మృతాశౌచమును నిర్ణ యించు గ్రంథములని తలంచుచున్నారు. పండితులును ధర్మశాస్త్రము గూడ తక్కిన శాస్త్రములంబలె సమగ్రముగ చదువవలసిన శాస్త్రమని నానాటికి మరచి పోవుచున్నారు. ఎప్పుడో పనిపట్టినప్పుడు ఏ ధర్మ సింధువునో, నిర్ణయసింధువునో తెరచి రెండుమూడు శ్లోకములు చూచుట తప్ప ధర్మశాస్త్రమందు సమ్యగ్జ్ఞానము సంపాదించుటకు పండితులు ప్రయత్నించుటలేదు. లేకున్న ఉబుసుపోనప్పుడు విధవా వివాహమండనఖండనమో, పరేలు వివాహశాసనఖండనమో మరే దో వాగ్వాదము పెంచికొని ఆయావాదముల కనుకూలములగు భాగ ముల తెరచిచూచుటతప్ప వేరొండులేదు. పండితులమాట ఇటుండ

ప్రస్తుతకాలపు బ్రాహ్మణుల యభిప్రాయమున ధర్మశాస్త్రములు కాల ట్టు శాసనములు మున్నగు ప్రజానిష్ఠురములైన శాసనముల పోల్కి గానుపించుచున్నవి. రామలింగారెడ్డిగారివంటి యబ్రాహ్మణ నాయకులు తరుచు మన్వాదిస్మృతులలోని ధర్మములుతిరిగి ప్రతిష్ఠింపబడి నట్లు కలగాంచి, యదరిపడి మేల్కాంచి, భీతభయులై ఎట్లెటో కాలము గడపుచున్నవారు.

ఇంక మరికొందరిచే (వీరు న్యాయవాదులు) "కోల్ బ్రోక్" "బుల్లర్" "జాలీ" మున్నగు దొరలు ధర్మశాస్త్రప్రతిష్ఠాతలనియు, "మెయిన్" మున్నగువారు వ్యాఖ్యానకారులనియు, తలంపబడుచున్నది. వీరిగ్రంథములం దేదేని విషయము సందిగ్ధమై తోచినయెడల, మీమాంసాధికరణములో యనందగిన "లారిపోర్టు"లలోనితీర్పుల పరిశీలించినచో సర్వసంశయ విచ్ఛేదము కాగలదు—అని మన నవీనన్యాయవాదిమతము.

ధర్మశాస్త్రి మీస్థితిలోనుండ పండితు లుదాసీనులైయుంట కేవలము విచారకరము. ధర్మశాస్త్రములు గౌరవింపతగినవే యైనచో, తన్మూలమగు వేదములపౌరుషేయములేయైనచో, స్మార్తధర్మములు సర్వదా, ఆచరణీయములైనచో, తత్ప్రాశస్త్యమును సర్వజనులకును బోధపరచుట పండితులకు విధియైయున్నది. ఇట్టి కార్యము పండితులే పూనుకొనవలయునుగాని ననుబోలు కించిజ్ఞులవల్ల నయ్యెడునదిగాదు. పరధర్మము వెల్లువయై మనలను ముంచివేయుచుండ పండితులు మౌనము వహించియుంట స్వధర్మమును నిరసించుటగాని వేరొండుగాదు.

ఈయుపోద్ఘాతము నింతటితో చాలించి కొన్నివ్యాసములలో స్మృతులయందుండు వ్యవహార ధర్మమందలి ప్రధానసూత్రములను నా యెఱిగినంతవట్టు వివరింపబ్రయత్నించెద. అచ్చటచ్చట పాశ్చిమసిద్ధాంతములగూడ నుదహరించుచు స్మార్తవ్యవహార ధర్మమునకు పశ్చిమవ్యవ

హార ధర్మమునకు గల భేదముల నిరూపించుటకుగూడ పూనుకొనిమెదను. కాని వ్యవహారధర్మము విషయమై ముచ్చటించుటకు పూర్వము ధర్మమనగా నేమో విచారింపవలసి యున్నది.

ధర్మము:— ఇట్టి పదము మరియేభాషలోను లేదు. "లా" అను నాంగ్లేయ శబ్దమువలన ధర్మశబ్దార్థము స్ఫురింపదు. ఇటులే జర్మన్, లాటిన్, గ్రీక్, ఫ్రెంచిభాషలలోని పదములు కొంచెమించుమించుగ "లా" అను పదమునకు తుల్యములేగాని ధర్మశబ్దార్థబోధకములు గావు. "లా" మున్నగు శబ్దములవలన పశ్చిములు గ్రహించిన విషయము మన "ధర్మ" మందొక భాగము. మనధర్మశాస్త్రములందుండు విషయములు పశ్చిమదేశముల యందనేక నామముల వ్యవహరింపబడుచున్నవి. "లా" అను శబ్దమునకు ప్రధానమైనయర్థము రాజశాసనముచే ప్రతిష్ఠింపబడిన వ్యవహారధర్మము (Positive law). ఈయర్థమున, "లా" అను శబ్దమునకు "వ్యవహారధర్మము" అనుపదము పర్యాయపదముగా వాడవచ్చును. కాని యిట్లువాడుటకు ముఖ్యమైన యభ్యంతర మొకటికలదు. అదియేమో ముందు నిరూపింపబడును. ఇక మన ధర్మశాస్త్రముల నాచారప్రాయశ్చిత్తాధ్యాయములలోనుండు విషయములు పశ్చిమదేశముల ననేకధా వ్యవహరింపబడుచున్నవి. వారిపరిభాష ప్రకారము కొంతభాగము Divine law, మరికొంత Natural law, మరికొంత Moral law, ఇటులనేక పదములచే వర్ణించి చెప్పిన "ధర్మ" పదార్థము పశ్చిములకు బోధపడవచ్చును. కాని యీపై జెప్పిన ఆంగ్లపదములలోని భావమంతయు కలబోసి యొకటిగా జేసి యూహించినను ధర్మపదార్థమునకు సరిపోదు. కారణమేమన "లా" అనుశబ్దమువలన ప్రధానముగా రాజశాసనము మాత్రమే గ్రహింపబడుచున్నది. పశ్చిమసిద్ధాంతముల ప్రకారము "లా"కుమూలము రాజాజ్ఞ (Command of the Sovereign). రాజాజ్ఞలకే "లా" యను

పేరు చెల్లియున్నది. రాజచోదితములైన విధిప్రతిషేధములకే 'లా' యనిపేరు. వీనినే సర్వజనులు ఏమరక ఎల్లప్పుడు నాచరించుచుండవలయును, ఏతదితరములైన విధులన్నియును ఐచ్ఛికములు. వానికి లా యను పదము చందురునివంటి మోమన్నట్లు సామ్యమువలన చేర్చబడియున్నదిగాని యథార్థముగ 'లా' అను శబ్దము వానికి వర్తింపదు. Divine law (మతసంబంధమైన విధులు) Moral law (నైతికప్రవర్తన విషయమైన విధులు) ఇట్టి విధులను జనులు గౌరవింపవచ్చును. గౌరవించుటయో గౌరవింపకపోవుటో వారి యిష్టాయిష్టములవలన నిర్ణయింపబడును. కాని ఐచ్ఛికములైన యీ నియమములలో కొన్ని ప్రజాక్షేమముకొరకై సర్వజనాచరణీయములుగ రాజాజ్ఞచే విధింపబడవచ్చును. కావున ప్రజాక్షేమముకొఱకై ఎయ్యది రాజాజ్ఞచే విధింపబడినదో అది 'లా' తదితరము లా కాదు. పశ్చిమసిద్ధాంతముల ప్రకారము 'లా' కు ప్రధానోద్దేశ్యము ప్రజాక్షేమము. తన్మూలము ప్రభువు (Sovereign)

ఇక ధర్మము విషయమై విచారింపవలసి యున్నది. 'లా' అను పదార్థము ధర్మశాస్త్రమం దొకభాగ మాత్రమనియు, 'లా' కు మూలము రాజాజ్ఞయనియు నిదివఱకే చెప్పియుంటిమి. ధర్మమునకు మూలము వేదము. వేదము లపౌరుషేయములు. అనగా ధర్మమునకు మూలము ఈశ్వరాజ్ఞగాని రాజాజ్ఞగాదు. ధర్మాచరణవలన పరమ ప్రయోజనము ఆముష్మికసౌఖ్యముగాని ఐహికసుఖముగాదు. అటులగుట ధర్మప్రయోజకులు త్రికాలజ్ఞులగు మహర్షులుగాని పృథ్వీపతులుగారు. మేదినీపతులును, తక్కిన మానిసులంబలె ధర్మబద్ధులర. ధర్మనిర్ణయమందు పశ్చిమదేశముల రాజునకు గల నిరంకుశాధికారము ఆర్యావర్తమున నెన్నడు నంగీకరింపబడలేదు. ధర్మము పురుషార్థములలో నొకటైయుంటచే, నద్దానికి పరమప్రయోజనము శ్రేయముగాని ప్రేయముగాదు. "యతోఽభ్యుదయనిఃశ్రేయస సిద్ధిః సధర్మః."(గౌతముడు)

కావున పరమపురుషార్థ సాధకములగు మార్గములన్నియు ధర్మ పదార్థమం దిమిడియున్నవి. ఇతరమార్గములన్నియు ధర్మేతరములు. ధర్మమునకు "లా" కు గల ప్రధానభేదమిది. "లా" కేవలము రాజ చోదితమైన వ్యవహారధర్మము (Positive Law) స్మృతులలోని వ్యవహారధర్మముగూడ వేదచోదితమైనదనియే ఆర్యుల సిద్ధాంతము. ధర్మశాస్త్రములన్నియు మూడుభాగములుగ విభాగింపబడి యున్నవి. అయ్యవి ఆచార వ్యవహారప్రాయశ్చిత్తాధ్యాయములు. మనుస్మృతియం దిట్టి విభాగము చేయబడియుండలేదు. గాని యీ మూడువిషయము లందును చెప్పబడియున్నవి. ఆచారాధ్యాయమున వర్ణాశ్రమాది ధర్మములు, వ్యవహారాధ్యాయమున దాయవిభాగము మున్నగు విష యములు, ప్రాయశ్చిత్తాధ్యాయమున ఆశౌచనిర్ణయము ఆపద్ధర్మాది కము యింక ననేక పాపకృత్యములకు ప్రాయశ్చిత్తవిధానము మున్నగు విషయములు, విస్తరింపబడి యుండును.

ఇంతవరకును ధర్మమునకు మూలమేమో, తత్ప్రయోజన మెయ్యదియో, ధర్మశాస్త్రములం దేయేవిషయముల గురించి ముచ్చ టించియుండిరో సూక్ష్మముగ విచారించియుంటిమి. కాని ధర్మమునకు లక్షణమేమో విచారించి యుండలేదు.

ధర్మలక్షణము స్మృతులయం దెచ్చటను గానరాదు.

"శ్లో॥ శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్యచప్రియమాత్మనః ।
ఏతచ్చతుర్విధంప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణం" ॥

(మనుస్మృతి) మనువు ధర్మమునకు మూలమేమో చెప్పియు న్నాడు గాని ధర్మలక్షణము చెప్పలేదు.

"సూ॥ శ్రుతిస్మృతివిహితోధర్మః తదలాభేశిష్టాచారః ప్రమాణం." ధర్మశాస్త్రముల ధర్మసూత్రముల నన్నిటిని పరిశీలించినను ధర్మలక్ష ణము గానరాదు. స్మృతులయందు ధర్మములనుగురించి చెప్పిరిగాని ధర్మమును గురించి చెప్పలేదు. ధర్మలక్షణమును చర్చించుట వారిపని గాదు. కాని స్మృతులలో చెప్పలేదనినంతమాత్రమున ధర్మమునకు లక్షణము మనవారు చెప్పనేలేదని యూహింప నలనుపడదు. ధర్మ

స్వరూపనిర్ణయము మీమాంసకుల పనిగాని స్మృతికర్తల పనిగాదు. పూర్వ మీమాంసాశాస్త్రము ప్రత్యేకమీపనికొరకే యేర్పడియున్నది. ధర్మజిజ్ఞాస మీమాంసకులకు పట్టినదిగాని మన్వాది స్మృతికర్తలకు పట్టలేదు.

సూ॥ "అథాతో ధర్మజిజ్ఞాసా" (జైమిని) అని జైమిని మీమాంస సూత్రములను ప్రారంభించియున్నాడు. కావున మీమాంసకులు ధర్మస్వరూపము నెట్లు నిశ్చయించి యున్నారో విచారింపవలసియున్నది. ధర్మము, విధి ఈ రెండు మాటలకు చాలదగ్గరచుట్టరికము. 'ధర్మమే విధింపబడును' విధింపబడినది ధర్మము. విధి అవశ్యము నిర్వర్తింపదగినది. విధులవిషయమున వికల్పమునకు తావులేదు. విధివాక్య మనుల్లంఘనీయము. ధర్మమనగా ఒక విధమైన చోదనము (ఆజ్ఞ) ఈ యాజ్ఞ శ్రుత్యుదితము. కావున వేదచోదితమైనది ధర్మము. ఎయ్యది శ్రుతిచే నాజ్ఞాపింపబడినదో (చోదితమైనదో) అదియంతయు ధర్మము. సూ॥ "చోదనాలక్షణోఽర్థో ధర్మః" (జైమిని) చోదనాను (ఆజ్ఞ) సారముగ నెయ్యది నిర్వర్తింపబడవలెనో అది ధర్మము. ఆ చోదనము శ్రుత్యుదితము. ఇచ్చట శ్రుతిశబ్దమువలన మన్వాది ధర్మశాస్త్రములగూడ గ్రహింపవలసియున్నది. స్మృతులన్నియు అనుమానింపబడిన శ్రుతులపై నాధారపడియున్నవి. "అనుమేయం శ్రుతిమూలం మన్వాది శాస్త్రం" (శాయనాచార్యుడు.) ఈ సందర్భమున పాశ్చిమ మీమాంసకులు "లా" స్వరూపము నెట్లు నిర్ణయించిరో విచారింతము : "A law is a Command which obliges a person or persons to a Course of Conduct" (Austin) మానవులకు ఒక రీతి ప్రవర్తన విధించునట్టి యాజ్ఞ "లా" అని "ఆస్టిన్" వ్రాసి యున్నాడు. కావున "లా" అను మాటకును "విధి" యను మాటకును కొంచెమించుమించుగ నొకటే యర్థము. దానికిని దీనికినిగల ప్రధానభేదమేమో ఇదివరకే చూచియుంటిమి. విధులన్నియు నపౌరుషేయములయిన శ్రుతిమూలకములు. వారి శాసనములు (లా) రాజచోదితములు — మూలభేదముతప్ప తక్కినలక్షణములు విధికిని "లా" కును సమానములే. ఈ రెంటికిని సామాన్యలక్షణములు :

రెండును చోదనములు — రెండును మానవుల కొకరీతి ప్రవర్తన విధించును. కాని యింకను మరికొన్ని లక్షణములు గల్గినగాని ఏ యాజ్ఞయు విధియనిగాని, "లా" యనిగాని యనిపించుకొనదు. ఏలన, మానుషకృత్యములను నియమించునవి రెండుశక్తులు- ఆశ- భయము. ఒకపని చేయుటవలన తన కేదియో లాభము గలుగునను ఆశవలననో, అదిచేయకుంటవలన బాధగల్గునను భయముచేతనో మనుజులు తమ తమ వ్యవహారముల నిర్వర్తించుకొనుచున్నవారు. లాభము గల్గునను ఆశ లేకున్నను, బాధగల్గునను భయము లేకున్నను మనుజుడేపనిని చేయడు. కావున ఏదేని విధిగాని, 'లా' గాని అవశ్యము నిర్వర్తింపబడ వలయునేని, అది నిర్వర్తించుటవలన లాభమో, ఉల్లంగించుట వలన బాధయో కలిగించు శక్తి వానితోబాటుగ నుండవలయును. లేకున్న నట్టి చోదనములు నిష్ప్రయోజనము లగును. "దొంగతనము చేయ వలదు" అని యాజ్ఞాపించిన రాజునకు దొంగలను శిక్షించు శక్తి లేకున్నచో ఆయాజ్ఞవలన నెవ్వరు బద్ధులగుదురు? కావున ఆస్టిన్ ఇట్లు వ్రాసియున్నాడు: "Law is a command enforced with a Sanction." అనగా ఉల్లంఘనము చేసిన ప్రత్యవాయము గల్గింప శక్తిగల్గి యుండు ఆజ్ఞకు 'లా' అని పేరు. అటు లగుట తిరస్కరించినవారికి ప్రత్యవాయము గలించుటగూడ 'లా' కొక ముఖ్యలక్షణము. ఈ ప్రత్యవాయమునకే ఇంగ్లీషున 'Sanction' అనిపేరు. 'Sanction' అను పదము ప్రత్యవాయమునకు మాత్రమేగాక, విధి నిర్వర్తనము వలన గలుగబోవు లాభమునకుగూడ వర్తించునని మరి కొందరి మతము. ఇక శ్రౌతస్మార్తవిధుల కీ లక్షణము కలదో లేదో విచారించవలసియున్నది. లాభాపేక్షయో, ప్రత్యవాయభయమో లేనిది మనుజులేపనిం జేయరను విషయము పశ్చిమదేశములలో నెంత నిజమో మనదేశములోగూడ నంతియునిజము. కాని వారి మతమునకు, మనకుగల భేదమేమన:— "లా" వలన గల్గబోవు లాభప్రత్యవాయములు ప్రత్యక్షమై ఐహికమై యుండవలయుననియు, తత్ప్రవర్తకతా శక్తినియతమైన ఒకయధికారియందో (రాజు) తత్తుల్యమైన మరియొక సంఘముందో (Determinate body) ఉండవలయునని వారిమతము.

ఇక శ్రౌతస్మార్తవిధుల విషయమునన్నో, తదాచరణవలన గలుగఁబోవు లాభనష్టము లప్రత్యక్షములు, పారలౌకికములు. ప్రవర్తకశక్తి, నియతమైన ఒకస్థానమందు లేదు. ఈ మతభేదమునకు కారణ మిదివరకే సూచింపబడియున్నది. ధర్మమునకు మూలమపౌరుషేయమైన వేదము. "లా"కు మూలము రాజాజ్ఞ అయియుంటయే కారణము. మరియు పాపభీతి, నరకభీతి జనులను సత్ప్రవర్తనయం దుంచగలుగునని వారికి నమ్మకము లేదు. ఆర్యావర్తమునన్నో పాపభయము మెండు. నరకప్రాప్తికి జంకినటుల రాజదండనమునకు వెరువరు. స్వర్గభోగాపేక్ష కాశపడినటుల ఐహికసుఖముల కాశింపరు. ప్రమాదవశమున పాపకృత్యము లొనర్చి, నరకప్రాప్తి తప్పించుకొనుటకై తమంతటతాము రాజదండనకు లోబడినట్టి పుణ్యపురుషుల చరిత్రములు పురాణాదుల గానంబడియెడి. అన్నగారూర లేనపు డాయన తోటలోనివి కొన్ని పండ్లుపయోగించి తరువాత తాను చేసినపని యకృత్యమని యెరింగి తనంతటతాను రాజుకడకేగి శిక్షననుభవించిన బ్రాహ్మణోత్తముని చరిత్రము భారతము చూచినవారి కందరకును విదితమే. కావున ఆర్యావర్తమున పాపభీతి, పుణ్యకాంక్ష ఈరెండును ధర్మప్రవర్తనకు ప్రోత్సహించునటుల రాజదండనవలని భయము ప్రోత్సహింపజాలదు. కాన మెడమీద కత్తిపెట్టి నడిపించినగాని జనులు "లా"కు బద్ధులైయుండరని వారి నమ్మకము "పాపముచేసిన నరకబాధ లనుభవింపవలయును, పుణ్యముచేసి స్వర్గసుఖము లనుభవింపబోదుము" అని చెప్పినంతమాత్రముననే ధర్మహాని గలుగ దని ఆర్యుల నమ్మకము— ఇటు లనుటవలన మనదేశమందు దండనీతియొక్క ఆవశ్యకత గుర్తింపలేదని యభిప్రాయము గాదు. అవసరముగునెడల రాజదండనము విధింపబడియేయున్నది. కాని ప్రధానముగ ధర్మమును రక్షించు శక్తులు, పుణ్యపాపభావనలుగాని, రాజదండనమాత్రముగాదు. ఈవిషయమున భేదమెటులున్నను ఉల్లంఘింపబడిన విధిప్రతిషేధములు ప్రత్యవాయజనకములనుట, వారికిని మనకును సమ్మతమే.

లాభాపేక్ష గలుగునను నాశ ధర్మాచరణకు పురికొల్పునని చెప్పియున్నాము. కాని, యీలాకలుగఁబోవు లాభము, ఇతర మార్గములవలన

సాధించుటకు వీలుగానిదిగానుండవలయు. ఆలాభ మన్యత్రి సిద్ధించున ట్లయిన ధర్మమార్గమున కేల రావలె ? కావున ధర్మాచరణవలన గలుగబోవు లాభము అనితరసాధ్యమై, అపూర్వమై, అతీతమై యుండ వలెను. ఇట్టిలాభ మాముష్మికానందము. దీనికి మీమాంసపరిభాష లో "అపూర్వ" మని పేరు. విధివిహితమైన కర్మాచరణమువలన, మనుష్యదుర్లభమైన ఈ "యపూర్వము" సిద్ధించును. కావున జనులు ధర్మమార్గము తప్పకుండునట్లు చేయునది "అపూర్వము" లభించునను నాశ. ఇక అధర్మమెట్లు నివర్తింపబడునో చూడవలయును. సత్కర్మల విధించునవి విధివాక్యములు. దుష్కర్మలను నిషేధించునవి ప్రతిషేధ ములు. ప్రతిషేధములను పాటింపకుండుటవలన ప్రత్యవాయము తప్పక కల్గును. ప్రాయశ్చిత్తరాజదండనా ద్యైహికబాధలు, మరణానంతరము యమదండనము— ఈబాధలు కల్గునను భయమువలన అధర్మప్రవర్తన మానివేయుదురు. కావున అపూర్వాపేక్షవలన ధర్మప్రవర్తనము, ప్రత్యవాయభయమువలన నధర్మనివర్తనము సిద్ధించుచున్నది. ఆర్య ధర్మమునకు ఈరెండును పునాదులు:—స్వర్గకామభావన, నరకభయ భావన.

ఇంతవరకును తేలిన విషయ మేమన, వేదచోదితమైనదెల్ల ధర్మమనియు, స్మృత్యాదులుగూడ, అనుమిత శ్రుతిమూలకముగాన ప్రామాణికములనియు, మూలోద్దేశ్యముల విషయమునతప్ప, తక్కిన విషయముల ప్రాక్పాశ్చాత్యసిద్ధాంతములకు విరోధము లేదనియు, "లా" ప్రత్యక్షమగు రాజదండనవలనను, ధర్మమప్రత్యక్షములగు స్వర్గ నరక భావనల వలనను, ప్రత్యక్షమైన రాజదండనవలనగూడ సంర క్షింపబడుచున్నవనియు చూచియుంటిమి,

శ్రుతిస్మృతివిహితమైనది ధర్మమైనచో నందు ప్రతివాక్యమును, విధియని శిరసావహింపవలయునా ? ఆవాక్యములయం దంతర్భేదము లేమైనకలవా ? "పంచనఖములుగల మృగములమాంసము తినతగినది" అని యొకవాక్య మున్నచో దీనికి, సర్వజనులును, అట్టి జంతువుల మాంస మవశ్యము తినితీరవలయునని యర్థమా, మాంసము తినగోరిన వారు అట్టి జంతువుల మాంసము తినవచ్చునని యర్థమా ? ఈమాంస

మందరు తిని తీరవలయునని యభిప్రాయమై యుండదు. కావున కొన్ని కర్మ లవశ్యము చేయవలసినవి, ఇష్టమైనచో చేయదగినవి కొన్ని, ఇట్టి భేదముండి తీరవలయును. ... ... ...

## దస్యులనగా నెవరు ?

అతి ప్రాచీనకాలమునందు ఈ హిందూదేశమున "దస్యు" లను మోటుజాతి ప్రజలు నివసించుచుండిరనియు, పిదప కొంతకాలమునకు నాగరికులును విద్యావంతులును అగు "ఆర్య" లను తెగవారు మధ్యాసియా ప్రాంతమునుండి క్రమక్రమముగ హిందూదేశమునకు వచ్చి అప్పుడిచ్చట నివసించు దస్యులనువారిని తమ భుజబలముచేత పారద్రోలి వారి ప్రదేశముల నాక్రమించి ఇచ్చటనే స్థిరనివాసముల నేర్పఱుచుకొనిరనియు, చరిత్రకారులు కొంద అభిప్రాయపడియున్నారు. నేనిప్పు డీ వ్యాసమునందు "దస్యులనగా నెవరు ?" అను విషయమును విమర్శింపదలఁచినాఁడను.

ప్రపంచమునందున్న గ్రంథరాసిలో ఋగ్వేదము అతి ప్రాచీన గ్రంథమనియు, ప్రధమగ్రంథమనియు, చరిత్రకారులు భాషాశాస్త్ర తత్వజ్ఞులు అందఱంగీకరించి యున్నారు. అట్టి ఋగ్వేదమునందు ఆర్య శబ్దము దస్యుశబ్దము పలుతావుల ప్రయోగింపఁబడియున్నది

అచ్చటచ్చట దస్యుశబ్దమును విశేషణముగ గ్రహించి వృత్రాదివాచిగను, అసురవాచిగను ప్రయోగించినను దస్యుశబ్దము యొక్క వివరము అచ్చటచ్చట కొన్ని మంత్రములందు గలదు. ఆర్యులనఁగా యజ్ఞయాగాదిసత్కర్మల నాచరించువారనియు, దస్యులనఁగా అట్టి సత్కర్మల నాచరింపక దురాచార నిరతులయి యుండువారలనియు గనంబడుచున్నది.

౧. మం. అకర్మా దస్యు రభినో అమన్తురన్యవ్రతో౽మాను
షః॥ త్వం తస్యామిత్రహన్ వధర్దాసస్య దంభయ॥ ఋ. సం. ౧౦. ౨౨. ౮

ఈ మంత్రమువలన దస్యులనువారలు అకర్మలనియు, అన్యవ్రతులనియు తెలియవచ్చుచున్నది. అన్యవ్రతులనఁగా శ్రుతిస్మృతి వ్యతిరిక్తకర్మల నాచరించువారని సాయనాచార్యభాష్యము.

౨. మం. విజానీహ్యార్యాన్యేచదస్యవో బర్హిష్మతే రంధయా శాసదవ్రతాన్ । శాకీభవ యజమానస్యచోదితా విశ్వేత్తాతే సధమాదేషుచాకన ॥ ఋ. సం. మం. ౧. ౫౧. ౮.

ఈ మంత్రమునందు ఆర్యులనఁగా యజ్ఞాదికము ననుష్ఠించువారలనియు, దస్యులనఁగా కర్మవిరోధులనియు, లేక కర్మవిహీనులనియును చెప్పబడియున్నది.

అర్యశబ్దము ఈశ్వరవాచిగ వేదనిఘంటువునందు గలదు. ఆ యర్యశబ్దముపైన అపత్యప్రత్యయమురాగా ఆర్యశబ్దము సిద్ధించుచున్నది. మొత్తముమీద సదాచారాదికముచేతను అభిజనముచేతను శ్రేష్ఠులగువారిని ఆర్యులనుగా గ్రహించినటుల అందఱు అంగీకరించియే యున్నారు. కావున ఇచట ప్రమాణవచనముల నుదహరింప దలఁచ లేదు. ప్రకృతమునందు దస్యుశబ్దమునకు సంబంధించిన విషయమును మాత్రమే ఇచట చర్చించెదను.

వేదషడంగములలో ముఖ్యమయినదియు, వేదార్థవిషయమునందు అత్యావశ్యకమును అగు నిరుక్తమను గ్రంథమును యాస్కాచార్యుఁడు రచించెను. ఆయాస్కాచార్యుఁడు దస్యుశబ్దమునకు అర్థము నీవిధముగ నిరూపించినాఁడు:—

దస్యుర్దస్యతేః క్షయార్థాదుపదస్యంత్యస్మిన్ రసా ఉపదాసయతి కర్మాణి. నిరుక్తము. ౭-౨౩.

౧ రసములను ( అనగా జలములను ) నశింపజేయువారనియు ౨ కర్మల నాశనము చేయువార లనియు అర్థమగుచున్నది.

వేదచతుష్టయభాష్యకారుఁడగు శ్రీమత్సాయణాచార్యవర్యుఁడు తానొనర్చిన ఋగ్వేదభాష్యమునందు అచ్చటచ్చట దస్యులనఁగాఁ గర్మభ్రష్టులనియును గర్మల నాశనము చేయువారలనియుఁ గర్మానుష్ఠాతలకు శత్రువులనియు వ్యాఖ్యానము నొనర్చియున్నారు.

ఈ రీతిగ పలుతావులఁగలవు. గ్రంథవిస్తరభీతిచేత వదలుచున్నాఁడను. ఈ విషయమును పాశ్చాత్య విద్వాంసులలో కొందఱుగూడ అంగీకరించియేయున్నారు. ౭

సంగతి సందర్భము లిట్లుండఁగా మనపూర్వులగు ఆర్యులు

నిష్కారణముగ ఒకమోటుజాతివారిని వారి స్వగృహములనుండి పాఱఁదోలి వారియింటియందు ప్రవేశించిరని చెప్పెడి అపనింద నిరాధారము; కావున దానిని మనవారలు విశ్వసింపవలదని విన్నవించుచున్నాఁడను. నిజముగా ఇట్టి క్రొత్తసిద్ధాంతములను చేసినవారలు తాము మొన్నమొన్న పుట్టినవారైనను, వేదములంత ప్రాచీనములు కాకపోయినను మనకంటె వేలకొలఁది సంవత్సరములక్రిందట పుట్టిన మనుస్మృతి మున్నగు గ్రంథములను ఆధునికములని త్రోసివేయుచుండుటచేత నేను ప్రప్రథమమున వేదమునుండి ప్రమాణమును చూపించియుంటిని. ప్రమాణపరతంత్రులకు మనుస్మృతిమున్నగు గ్రంథములు మాన్యములే కావున నేను అట్టి గ్రంథములనుండి ప్రమాణముల నిచ్చుచున్నాఁడను.

మనుస్మృతియందు "దస్యు"లను గూర్చిన వర్ణనమీ విధముగ నున్నది:—

శ్లో॥ ముఖబాహూరుపజ్జానాం యాలోకే జాతయో బహిః।
మ్లేచ్ఛవాచశ్చార్యవాచ స్సర్వేతే దస్యవస్స్మృతాః॥ మను ౧౦. ౪౫.

వ్యా. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాణాం క్రియాలోపాదినా యాజాతయః బాహ్యాజాతా మ్లేచ్ఛభాషాయుక్తా, ఆర్యభాషోపేతావా తేదస్యవస్సర్వేస్స్మృతాః॥ అనఁగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులవారిలో ఆయావర్ణములవా రాచరించవలసిన క్రియలు మున్నగు వానిని వదలి స్వేచ్ఛగా చరించువారలు దస్యులని పిలువఁబడుచున్నారని యర్థము. క్రియాహీనులయి ఆర్యుల సామీప్యమునందుండుటచేత ఆర్యులు వ్యవహరించెడి భాషను సంభాషించుచున్నను, సన్నిహితసంబంధములేక దేశాంతరమునకు చేరి మ్లేచ్ఛభాషను సంభాషించుచున్నను వారలు దస్యులనియే పైశ్లోక తాత్పర్యము.

యవనులు, శకులు మున్నగువారలు ఖండాంతరములనుండి ఇచటికి వచ్చినవారలుకారనియు, వారందరు ప్రప్రథమమున హిందూదేశమునందలి క్షత్రియజాతికి చేరినవారలనియు క్రమక్రమముగ సంస్కారవిహీనులయి శూద్రతుల్యులయినారనియు మనుస్మృతికారుఁడు చెప్పుచున్నాఁడు.

ఐతరేయ బ్రాహ్మణము సప్తమపంచికయందు శునశ్శేఫుని కథగలదు. ఆకథయందు, విశ్వామిత్రమహర్షికి ౧౦౦ పుత్రులు గలరనియు, అందులో జ్యేష్ఠులగు ౫౦ మంది పుత్రులు తనయాజ్ఞను తిరస్కరించుటచేత కుపితుఁడై వారిని శపించెననియు, వారలె పుండ్ర-శబరి-పులింద-మూతిబ- మున్నగు దస్యుజాతి విశేషముగలవారలై రనియు చెప్పఁబడినది.

శ్రీమద్రామాయణమును పరిశీలించిచూచినను శక, యవనాది జాతులనువారు ప్రప్రథమమున ఆర్యావర్తదేశమునందే జన్మించిరనియు, కాలక్రమమున దేశదేశాంతరములకు వ్యాపించి యుండవచ్చు ననియు ప్రమాణవచనములు గనంబడును. ... ...

మహాభారతమునందు యయాతి చరిత్రమొకటిగలదు. అతనికి అకాలమునందు ముదిమిసంభవించఁగా అతఁడు తనపుత్రులను తన వార్థక్యమును గ్రహించి వారి యౌవనమును తనకిమ్మనికోరెను. కాని వారందుల కంగీకరింపలేదని యయాతి కుపితుఁడై యదు, తుర్వసు, ద్రుహ్యు, అను అనియెడి పుత్రచతుష్టయమును శపించెను. వారిసంతానము యవనాది జాతిగ పరిణమించెను అని గలదు.

దీనివలన పాఠకులు గ్రహింపవలసిన విషయములివి:- ఎవరో కొందఱు చెప్పినట్లుల మనము దేశదిమ్మరులమయి ఇచటికి చేరలేదు. ఆర్యులమగు మనము నివశించుటచేతనే మనదేశమునకు "ఆర్యావర్త" మను పవిత్రనామము పెట్టఁబడినది. ఈదేశమునందెవరో కొండజాతులు దస్యులనువారు నివశించుటగాని వారిని మనము పరాక్రమముచేతగాని లేక దురాశచేతగాని హింసించి తరిమివేయుటగాని యథార్థముకాదు. అలసులయిగాని లేక ప్రకృతివైచిత్ర్యముచేతగాని లేక దుర్బోధచేతగాని వారివారికేర్పఱుపఁబడిన విధులనాచరింపక స్వేచ్ఛాచారులయిన ఆర్యులను తెగకుచేరినవారలే దస్యులని పిలువఁపడుచుండిరి. క్రమక్రమముగ వారు దూరదూరప్రదేశములకు సైతము వ్యాపించుచుండుటచేత ప్రత్యేకప్రత్యేక భాషలుగలవారుగకూడ నైరి. సంస్కారహీనులయి శూద్రతుల్యులయిన క్షత్రియజాతి విశేషులగు పౌండ్ర, ద్రవిడ, ఓఢ్ర, కాంభోజ, యవన, శక, పారద, పల్లవ, చీన, కిరాత, దరద, ఖశులనువారలు వారితో కలసిపోయిరి. నానాఁటికి వీరి సంఖ్య మి

ష్కూటమగుటచేత ఈ దస్యులనువారివలన మన పూర్వులగు ఆర్యులకు కొన్ని యపకారములు జరుగుచుండ తన్నిరసనమునకుగాను మనయార్యులు దేవతలను స్తుతించుచుండిరి; ఆస్తుతిని తెలిపెడి మంత్రములు ఋగ్వేదాదివేదములందు మెండుగఁగలవు. దస్యులకంటెఁ జెడిపోయిన ఆర్యులని సారాంశము తేలుచున్నది. ఇకనైనను, ఆర్యవంశీయులమగు మనము ఇంద్రియ చాపల్యమునకు లోనై మనము చేయవలసిన ధర్మము నాచరింపక స్వేచ్ఛాచారులమై చరించితిమేని మనము కూడ “దస్యుశబ్దవాచ్యులము” కాగలము. కావున అట్టి కళంకము మన యార్యులకు పట్టకపోవుగాక. సిరిభాండాగార కార్యదక్షయును, సభ్యుఁడును మన యార్యవిజ్ఞానవ్యాప్తికై ప్రయత్నించుచు మన దేశమునకుఁగల యార్యావర్తనామమును సార్థకపరచునుగాక. మనకు ఈ భూమియే జన్మభూమియును నిష్టభూమియును నగుచుండునుగాక.

## గ్రాంథిక వ్యావహారిక భాషావివాద తారావళి.

సీ. శ్రీమించునాఁడెలం జెఱువు క్రొన్నెలపూవు చెలువాయె ; లేఁత వెన్నెలలు గాయ
వెలిదామరలకు విందులు సేయ కన్దోయిఁ గరుణాకటాక్షవీక్షణము లోలయ
వాల్గువాస్తముల వీణాలతాపుస్తకస్ఫటికాక్షమాలికల్ పరిఢవిల్ల
స్తనకలశత్సంగీతసాహిత్యరసమయక్షీరముల్ సుతులనో రూరఁజేయఁ
దమ్మిగద్దెమీఁద నెమ్మిఁ గొల్వయి మహా, దగము వెలయు దివ్యదర్శనమ్ము
మాకొసంగుచున్న మాతల్లి నీకివే, వందనమ్ము లాంధ్రవాఙ్మతల్లి ! ౧
ఆ. “దేశభాషలందుఁ దెలుఁగు లె”స్సనిమహా, రాజనుతులు గాంచి ప్రబలునీదు
నతులభాగ్యతతికి సుతుల మైత్రి మాను, నింతకంటెఁ జెంపఁ కేమి గలదు. ౨
చ. దిరిసెనపూలమెత్తనయఁ దేనియతీపును గండువెన్నెలం
బరఁగిన తేట కప్పురపుఁబల్కుల వల్లనితావి కల్గి పై
న్మరుఁ వెసలారఁగాఁ గరము ముద్దులు గుల్కెడు కల్కిపల్కులన్
మురిసెడు నీదుగర్భమునఁ బుట్టిన యాంధ్రులభాగ్యమెట్టిదో. ౩
శా. మాయమ్మా నిజపుత్రికల్ గలసి యిమ్మాడ్కిన్ నినుం బెద్దగాఁ
జేయంగల్గిన యంచుఁ బెక్కగతులం జింతించుచున్నారు. నీ
శ్రేయోవృద్ధికి నేది మంచితెరవో చెప్పంగదే దేశభా
షాయోషాముకుటీమణీవయవిభూషా ! యాంధ్రభాషాసతీ ! ౪
చ. కడుకొని నీదు పెంపునకుఁ గానిదియా నిది గాదటంచు నీ
కొడుకులలోన నొండొరులకుం దగవుల్ ఘటియిల్లె నమ్మ నీ
యెడ నెడ భక్తిలేనిసుతు లేవరు లేరు వారుగానందు. నే
వడుపున నింక వీరలవివాదములం దొలఁగించి ప్రోచెదో. ౫

సీ. నిను వేల్పుబాసతోఁ బెనఁచి ప్రోడను జేయుచున్న య్యకవినాథు డెన్న హితవొ
జిలిబిలిముద్దుఁబల్కులు నేర్పి నినుఁ బెంచు తిక్కన్న సుకవీంద్రుఁ డెక్కు హితవొ
సూక్తివైచిత్రిచే సొబగునించి ప్రసిద్ధిగావించు నెఱ్ఱన్న త్రోవ హితవొ
కమనీయగజరాజగమనమ్ము గఱపి నిన్ దగఁ బ్రోచు శ్రీనాథు దారి హితవొ
కోమలశిరీషతులితసుధామనోజ్ఞసూక్తి, సంపదలఁ గూర్చు పెద్దన్న సరణి హితవొ
కాక యీనాఁటి గ్రామ్యోక్తి కలనహితవొ, చెప్పవే తల్లి! యేమార్గ మొప్పు నీకు. ౬
ఉ. నన్నయముఖ్యపూర్వకవినాథులు సొంపులు దిద్ది గ్రామ్యతా
పన్నతఁ బాపి నిన్నుఁ బెఱబాస వెలందులలోన నెంతయున్
మిన్నగఁ జేసినారదియు మే లనుకొంటిమి గాని దాన నీ
కున్నతి గల్గదందు రిది యొప్పునొ యొప్పదొ నీవ చెప్పుమా. ౭
సీ. పరమపావనకథావిరచనాకలనమై మనసురంజించు రామాయణమ్ము
తత్త్వరసములందుఁ దన్మయత్వమ్ము నాపాదించు శ్రీమహాభారతమ్ము
ముక్తినిదానమై భక్తిరసావేశపరవశత్వముఁ గూర్చు భాగవతము
శ్రుతిపర్వమై ప్రౌఢకృతిసంతతికి శిరోభూషణమ్మై యొప్పు నైషధమ్ము
తే. మొదలయినపూర్వకృతులలోఁ బొదలుభావ ప్రాఁబలుకుబాసయుండఁ బోలెఁ బ్రాతపడియెఁ
బనికిరాదది యీనాఁటి ప్రజలకందు రకట కొందఱీవె మందువంబ ! చెప్పుమ. ౮
తే. అతులితాధ్యాత్మరామాయణాదికృతులు, నందనులచేతఁ బాడించినావు తొల్లి
యిపుడు కటకట "యెత్తినా యెంకి"పాట, నీకు నింపయ్యెనే యాంధ్రలోకజనని ! ౯
ఆ. దినదిన మ్మొకొక్కతీరుగా మాఱుచు, దారి తెన్ను లేక నోరికాలఁది
నాఁడబడుచు నున్న పలు వేసముల బాస, తల్లి! కైఁతలకును దగునె చెప్పుమ ! ౧౦
ఆ. బ్రదుకు దారవోసి పాశ్చాత్యభాషైక, పాండితిం గడించు ప్రౌఢులకును
గొన్ని నెలలు నిన్నుఁ గొలువనోపిక లేదొ, మాత ! నీదురూపు మాపనేల. ౧౧
ఆ. పండితులు మాటలాడుభాషలోనఁ, గైఁతసెప్పుట లోకోపకార మంత్రు
పామరుల బాస చేసినపాప మేమి, మాత యదిగూడ నుద్ధరింపంగఁ దగదె. ౧౨
క. ఇద్దానికి దిగినన్ మతి, వద్దుందునె యిచ్చవచ్చినట్లు లుమార్పన్
ముద్దులు గులికెడు నీదగు, సుద్దులు చెడిపోవె నియమశూన్యము లగుటన్. ౧౩
ఆ. కన్నతల్లి వీవు గావంచు నీపద, సేవ లింక శవము సేవలంచు
మఱియు నీదురూపు మాఱిపోయె నటంచు, నిందు నందు దూఱుచుందు రకట. ౧౪
మ. అవునా మాఱవె నీవు నన్ నిజముగా దా లేదనన్ వచ్చునే
కవివర్యుల్ నిజకావ్యసంతతులఁ దత్కాలమ్మునం గల్గు స
ద్వ్యవహారోక్తులు సంస్కరించి కయికోరా దాననే నీకుఁ బెం
పవుఁగా కొక్కటుఁ బుట్టి మున్గినటు కట్టా ! యిట్టిమా ర్పేటికో. ౧౫
శా. స్వాతంత్ర్యప్రియులయ్యుఁ దిక్కనముఖుల్ ప్రాచీనమార్గమ్ము సం
జేతః ప్రీతిదలిర్పఁ గైఁతలను దేశీయోక్తులం గూర్చరే ?
యాతీరొప్పదె ! మాటలాడు నానుడు న్నట్లుండవే యానుడుల్
మాతా ! దీనికి లేనిపోనితగ వేలా నీవ యూహింపుమా. ౧౬
ఆ. తొంటిదారిమార్చ దొరకున్న నీసుతుల్, ప్రేలుచూపమండ్రు మిగఁ జూతు
రదియుఁ గాకకొంత బెదరులే కెడ నీకు, కొలువు సేవగించుకొండు రకట. ౧౭

క. నెట్టన మూసతమపట్టిన, పట్టు విడువలేక విసివిసలు దెలుఁగుల నిన్
దిట్టులయి సభలలోఁబడ, దిట్టుదురట కొడుకు లెంత తెంపరితనమో. ౧౮
సీ. పువుదేనెసోనలై చెవులపండువు సేయు కలికిపల్కుల ముద్దుగులుకు నిన్ను
నియతిదప్పక కృతిక్రియల నొప్పులుగొన్న యిల్లాలవై యుల్లసిల్లు నిన్ను
నాచంద్రతారార్క మవని నిల్చెడు మహాకవులైన కొడుకులంగన్న నిన్నుఁ
బ్రణుతవిద్వత్కవిప్రభువర్యు లగు నేలమన్నీండ్రమన్ననల్ గొన్న నిన్నుఁ
"దెవులు గదిరి క్రుళ్ళిచివుకులంజియయయి, త్రెళ్ళ" ననియెఁ బ్రాతతెనుఁగుఁగమ్మ
జననీ! సాధ్వి సిట్టులనఁగూడునే వింటె, కొడుకునుడులు చెప్పికొనిన సిగ్గు. ౧౯
ఉ. భారతికిల్లునాఁ బరఁగి పండిత పామరహృద్యమైనయా
భారతభాష సచ్చె నని పల్కిరి. పాపము శాంతమగుత. మీ
వైరచియింతురో మరలభారతమున్ వ్యవహారభాషనే
దీ రచియింపరాదె యది యట్లు రుచించునొ చూత మమ్మరో! ౨౦
ఉ. చీకటిమాటికిన్ నిను నిసీయనుచున్ నెలయాలవంచుఁ దా
శేటికి దూఱఁగావలె నదేపనిగా. నిదియేటిన్యాయ. మీ
పాటి భవత్తిరస్కరణపద్ధతి మాని సుబోధమంచు మ
మ్మాటికిఁ దారు మెచ్చెడు సమంచితభాషనె కొల్వరాదొకో. ౨౧
ఆ. పుట్టగొడుగు లెన్ని పుట్టవో గిట్టవో, కట్టులేని బాసఁ బుట్టుకృతులు
గాలికెగిరిపోవుఁ గా కవి నిల్చునే, భారతాది కృతులపగిది జగతి. ౨౨
ఉ. భారతముఖ్యసత్కృతులపద్ధతి నాఁడిపుచ్చి యిచ్ఛమై
నోరికి వచ్చినట్టులు నినుం గృతులన్ వికృతస్వరూపగా
గూరిచి వాడఁబోచ్చి రిదిగూడదు నా వినిమాను వార లె
వ్వారును గారు. కాల మనివార్య. మిఁకేగతి మాటి పోవునో. ౨౩
తే. ప్రకృతిమారెఁ గాలముమారె భావమారె మంచికో చెడ్డకో యిట్టిమార్పువచ్చె
మాన్ప నెవ్వరికిశక్య మీమార్పు తుదకు నంబ నీకు శుభోదర్క మగును గాక. ౨౪

ఉ. కన్నులు మూసి పెన్నిదుపుకన్నఱతిం బెఱబాసఁ గొల్చుటన్
మున్నటిదాఁక నీదగు సమున్నతి యేగతిగల్గు నన్త్రలం
పున్నదె నీదుపుత్త్రిల, కహో యది యిప్పుడు గల్గెదావకా
భ్యున్నతిసూచకమ్మిదియ పోయెటులైన శుభమ్మ నీకగున్. ౨౫
సీ. సంస్కృతాంధ్రాంగ్లేయసారస్వతానూనవిజ్ఞాన సంపత్ప్రవీణమతులు
సామాన్యదుర్జ్ఞేయసకలభాషాతత్త్వసారసంగ్రహకలాసంగరతులు
ధారాళవిమల వాగ్ధాటీరమాతోషితాశేషవిద్వజ్జనాభినుతులు
భాషాంగనామణీభూషాయితవిచిత్ర కల్పనాకల్పితానల్పకృతులు
తే. గాని సర్వసాధారణుల్ గారునూవె, యిరుదెఱంగుల నినుఁ గొల్వనెంచువారు
వీరి నొండొరు నేకీభవింపఁ జేసి, మంచిదారిని నడపింపుమా మదంబ! ౨౬
ఆ. ఉభయవాదులకును నుల్లంబునందు నీ, హిత మిదంచుఁ జక్క నెఱుఁగఁ జెప్పి
యూను లుడిపి కలపి నీసేవ సేయించి, ప్రోపునంది మమ్ముఁ బ్రోవు మంబ. ౨౭

## — సావిత్రి బ్రహ్మను శపించుట. —

ఉ॥ శౌచవిహీన మున్ను పలుకాంత్యలఁజేరి తదాత్మయోనియై
రోచెలిమించియున్న యఘరూపిణి యీయొఱగొల్లపిల్ల. యా
నీచను జెట్టఁబట్టుటను నీకిఁకఁ బుట్టును గొల్లపిల్లయే.
రోచతురాస్య! యంత్యజయు నుద్భవిలుఁగ తుతయోని రో ర్తటన్. ౯౪
కం॥ పితృమాతృశ్వశురుల సంతతులను నుడికింపఁగలదు తత్కన్యలు. గ
ర్హితమగు నీకృత్యంబున క్షితిపయి నీకిఁకఁ బూజసేయరు మనుజుల్. ౯౫
కం॥ నామాటను యాథార్థ్యం బేమాత్రంబైన నుండెనేని నిను బూ
జామానితుఁజేసినజను లీమహిని దరిద్రులగుదు రెంతయు వేధా! ౯౬
కం॥ ఈరోఁతచేఁతయొనరిచి యేరీతిని సిగ్గుపడక యిఁకనొక పెదగన్
జేరోలగముందీర్చెద. హా రా! యెంతటికైన నతిసాహసివే. ౯౭
తే॥ పుత్రులయుఁ బౌత్రులయు నీదు మిత్రములగు తక్కసురలయు భూసురతల్లజులయు
దలలు నేలనుబడియె నీసలిపినట్టి సంకరపుఁజైదమునఁజేసి సత్యముగను. ౯౮
కం॥ ఉండదు నీదోషం బిటు ఖండితముగ. లజ్జలేదు కాముకులకు. నె
ట్లుండును గృత్య మకృత్యము రెండును గుర్తెఱుఁగనట్టి స్త్రీలోలులకున్. ౯౯
ఆ॥ మిత్రు శత్రువునిగ శత్రుని మిత్రుఁగం గృత్యముం గరంబకృత్యముగ న
కృత్యమైనదానిఁ గృత్యంబుగా నెంతు రకట! కాముకులు జడాత్ములగుచు. ౧౦౦
ఆ॥ జూదగానియెడల నూనృతముంబోలెఁ గన్నగానియెడలఁ గరుణభంగి
మేదినీశునెడల మిత్రత్వముంబలెఁ గామియెడల సిగ్గు గగనసుమము. ౧౦౧
కం॥ లవణసముద్రము మధురంబవుఁగా కవుఁగాక చంద్రుఁ డత్యుష్ణతనుం
డవుఁగాక యగ్ని చల్లని. దవునే కాముకుఁడు లజ్జితాత్ముఁడు జగతిన్. ౧౦౨
ఆ॥ సవతిపోరు నాకు సంఘటించుటకుఁగా వగవ నాత్మయందు మిగులనేను.
యువవరుణు వేలపూఁబోండ్లఁ బెండ్లాడుదురు స్వతంత్రులగుట దోషమేమి. ౧౦౩
మ॥ వలపుం బట్టఁగలేకయున్నఁ జని సద్వంశంబువంబుట్టు శు
ద్ధల నీవున్ నిజజాతికన్యకల మీఁదం బక్కలన్ వేసినా.
మ్మల వేశ్యాంగనకట్లు పెక్కురుమగం డ్డిద్దానికిం జూడ. దు
ష్కులజం బాద్భుశఁ బెండ్లియాడి. అదియే శోకంబు నా కెంతయున్. ౧౦౪
ఆ॥ కాన సిగ్గువిడిచి కాముఁడుండవై మనెదు నీదుపేరు మామకీన
మైన శ్రవణయుగళమందువఁ బడనట్టి స్థలముగూర్చి యేగుదాన నేను. ౧౦౫

చం॥ ననుఁబిలిపించియిచ్చటికి నాసరివారగు వేల్పుటాండ్రయున్
ఘనులయినట్టి వేల్పులయు క్ష్మాసురవర్యులయున్ సమక్షమం
దునఁ గడు నొసగించితివి తుందుడుకొప్పఁగ. నట్లుగాన నే
జనుఁడును నీకుఁ బూజనము సల్పకయుండును గాక! కేశన్ విధీ! ౯౦౬
ఆ॥ ఈదివసంబునుండి యే బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రజనము వచ్చినీకు
మంత్రపూజసేయు మహిని దారిద్ర్యసమన్వితంబగుం దదన్వయంబు. ౯౦౭
కం॥ ఈగొల్లపిల్ల చేయున నేఁగూర్చుండెడిస్థలమున నే కూర్చుంటన్
దాఁ గనదు సంతు. దివిజస్త్రీగణముం బోలె స్త్రీలు సేవింప రిలన్. ౯౦౮
సీ॥ అగ్గలంబగుదుఃఖ మందెదు నిద్రాని సేవించినటువంటి సింహమధ్య.
గొడ్డుదై యవమతింగుడిచెదు నిద్రానిఁబూజించినటువంటి పూవుఁబోఁడి.
మహితదౌర్భాగ్యయై మనియెదు నిద్రానివర్ణించినటువంటి యంబుజాస్య.
యత్యంతపాపిష్ఠ యయ్యెదు నిద్రానిగౌరవించినయట్టి కలభయాన.
పంచభర్తృకయగు దీనిపగిది దీనిఁగొలుచుచెలి నష్టచరిత్రయై చెలువుదొలఁగి
కర మపఖ్యాతిగాంచెదు ధరణిలోన నాదుశాపంబుదగిలి యీనాఁటినుండి. ౯౦౯
సీ॥ సత్యశౌచములకుం జాలదూరంబుగా వర్తించు నిద్రానివంశమెల్ల.
శిష్టసాంగత్యంబు స్పష్టంబుగానుండ దవనిపై నిద్రానియన్వయమున.
కిల్లువాకిలిలేక యెల్లకాలంబును వనములమను దీనివంగసంబు.
అవులఁదెగసమ్మి యాత్మలం బోషింతు రిద్దానిజను లెద్దుమొద్దులగుచుఁ.
బాపభూయిష్ఠులగుదు రీపంచభర్తృజాతిజనులందఱును. నట్టి నీతి నేమ
మూరునుం బేరు లేని యవ్వారలకుఁ జుట్టములుపో నిశాచర! కట్టకడకు" ౯౧౦
వ॥ అని బ్రహ్మను బతివ్రతయైన గాయత్రిని శపించి ౯౧౧

—• సావిత్రి ఇంద్రాదుల శపించుట. •—

శా॥ "ఓహో వాసవ! పంచభర్తృయగు నీయాభీరకన్యం దార్చి బ
ల్సాహాయ్యంబును జేసితీవు విధికిన్. శత్రుల్ నిన్నుం గెల్చి నీ
బాహాద్వంద్వము నుక్కుసంకెలలచే బంధించి కొంపోయి ని
ద్రాహారంబులులేకయుండునటు కారాగారమం దుంతురుపో. ౯౧౨
ఆ॥ వాసుదేవ! నీవువచ్చి నాముగనికిం బంచభర్తృతోడఁ బాణిపీడ
నమున కనుమతించినావు. నట్లుగావున భృత్యుఁడగుముపోయి పెరల కింక. ౯౧౩
చం॥ సవిధమునన్ వసించియును శంకర! యిప్పని కూడదంచుఁ జె
ప్పవయితి. మూఢ! యిప్పగిది భావ్యమె యూరకయుంట. కావునన్

శ్రీరణమొనర్పు వాదునడీ. నాకు వియోగము జీవమానుఁడో
ధవునిదె కాని నీకు మృతదారవియోగము సంభవించెడిన్. ౯౧౪

ఆ॥ ఏ మఖంబులోన నీ పంచభర్తృక సోమిదమ్మయగుచు సేమమూనె
నా మఖము వావిస్సు నత్యంతచపలత బడి గ్రహించుచుంటి వహ్ని! నీవు. ౯౧౫

తే॥ కాన దుష్టసమాచార! కమ్ము సర్వభక్షకుండవు. స్వధతోడ స్వాహతోడఁ
గూడి దుఃఖంబె సర్వదా కుడుకుగాని మునుపటట్టుల సౌఖ్యంబు నెనయవింక.

శా॥ ఈ భూదేవులు పంచభర్తృకను దా మెంతే ఘనంజేసి దు
ర్లోభావిష్టత బ్రాహ్మణీసతిగఁ జేర్కొంచుం గదుర్ ద్రేల్చినా.
రాభీరాదిజఘన్యజోపపతులున్ స్వాధ్యాయవిక్రేత ల
గ్నాభావంబుగలాగు నయ్యెదరు వీ రాదోషభూయిష్ఠతన్. ౯౧౬

కం॥ ఓహోవిత్తపతీ! ధనసాహాయ్యముసేసితీవు సవవిప్లవమం-
దీహేతువున నభోగ్యంబౌ హీనా! పొమ్ము యుష్మద్ధనము నీకున్. ౯౧౭

మత్తకోకిల॥ ఆవిధంబునఁ బంచభర్తృక మైన యీ మఖమందు నే
దేవత ల్గురీతిఁ దోడ్పడి తృప్తిచెందిరో యట్టి దు
ర్భావు లింతటినుండి తా మసపత్న్యలై కృశియించుచోం
జేవడిన్ దనుజాళిచేత జయింపఁగాఁబడుచుం డ్రిలన్. ౯౧౮

మ॥ మఱి వాభీరి సపత్నియంచుఁ జెడునామంబు ల్లమిందాల్చి రే
తెలివ ద్దీని కెలంకులందు శివదూతీపూర్వ లున్నారో యా
పరమద్వేష్యలు వేలువేలఁ బరద్భక్ష్యాతంబునన్ లేక యొ
క్కరికిం బోవఁగరాని గట్లకడలన్ వర్తింత్రభోగంబుగన్" ౯౨౦

—శ్రీ సావిత్రి యొంటికాలఁ గొండయెక్కుట. శ్రీ—

వ॥ అని యింద్రాదులంగూర్చి పలికి కోపోపహతచేతస్కయగు సావిత్రి సూరిల
వర్తిల్లు నఖిలదేవపత్నుల విడనాడి లక్ష్మీప్రభృతులచే నివారింపఁబడుచున్నదయ్యు నీ
శాముకు నామంబుగూడ వినంబడనియెడకుఁ బోయెదనని యుదఙ్ముఖంబుగం బయనమై
యెడమకాలు తటంబునమోపి కుడికాలఁ బర్వతం బధిరోహించె. నిప్పటికిని దద్వామ
పాదంబు పాపహరంబును బుణ్యప్రదంబును నగుచుఁ బర్వతరోధస్సునం బరిదృశ్యమా
నము. పాపసమాచారుఁడయ్యు నెవఁ డద్దానిఁ బూజించు వాడు పాతకనిర్ముక్తుఁడై
పరమపదంబుఁ బడయు. నెవ్వఁ డెయ్యది యర్థించి యయ్యది యర్చించు దుర్గభార్గ
మైనను వాఁ డవశ్య మద్దానిఁ జెందఁగలఁ. డివ్విధంబునం బతిచేఁ బరాభూతయై సావిత్రీ
దేవి పర్వతాశ్రయయయ్యె. నెవఁడాయమ నిచ్చవచ్చిన దినంబుననఁగాని విశేషించి పార్శ్వ

మాస్యంగాని పూజించు వాఁడు మనోభీష్టంబుల నన్నింటిని బొందించు. భక్తిచేఁ దద
గ్రంబున దేవిచే నాజ్యంబుపోసి రక్తతంతుదీపంబు వెలిఁగింపఁబడు నెన్నితంతువు
లెన్నిముహూర్తములు వెలుంగునో యన్ని జన్మసహస్రములు ౯౨౧

సీ॥ సౌభాగ్యసహితయై క్షమఁజెలంగునుగాని వికృతస్వరూపయై వెలయదావె.
పుత్రపౌత్రులతోడఁ బొలుపారెడుంగాని గొడ్డురాలై మదిం గుందదావె.
యర్థసమృద్ధితో వావణించెడుంగాని దారిద్ర్యమున విధిం దూఱదావె.
సచ్ఛీలయగుచుఁదా సంచరించునుగాని స్వైరిణియైమనం గోరదావె.
యింక విధవయయ్యె నేస్త్రీ తదగ్రమం దాటయాడు నాకె యపుడు తనదు
తనువుఁబోలె నద్యతనపురాకృతదుష్కృతములఁ గరము పీడితములఁజేయు. ౯౨౨

వ॥ పాటఁబాటినబోటి యాపాట యెన్ని జంతువులు విను నన్నివేలయేండ్లు స్వ
ర్గసుఖం బనుభవించు. ఫలదానంబొనర్చినచెలువ ఫలసంఖ్యాప్రమాణంబులగు యుగం
బులు త్రిదివంబున వసించు. సావిత్రీదక్షిణపార్శ్వంబున బ్రాహ్మణులకును విశేషించి
ముత్తైదువులకును మృష్టాన్నంబు పెట్టిన సిక్థప్రమాణయుగంబులు త్రిదశాలయవాసంబు
చేయురెడి. నొక్కరసంబుతోడను నొక్కయన్నంబుతోడను శ్రద్ధాసమన్వితంబుగా
శ్రాద్ధంబు పెట్టిన గయాశ్రాద్ధఫలంబుగలుగు. నాదేవి కుడిప్రక్కఁ గూరుచుండి నిజ
భార్యానీతంబులగు నీరంబులచే సాయంసంధ్యవార్చిన బ్రాహ్మణుఁడు పండ్రెండు
వత్సరంబులు సంధ్యోపాసనచేసిన ఫలంబు పడయఁగలిగెడి. సావిత్రియెదుట నుపవి
ష్టుఁడై జపియించిన మూఁడువేలయుగంబులు నూటపదునైదెండు పుట్టువులం బొనర్చిన
పాతకంబు నశియించుఁ గావునఁ బ్రయత్నపూర్వకంబుగం జమత్కారపురమునకరిగి
యాదేవి నర్చించునది. విశేషించి నుతియించునది. యీసావిత్ర్యుపాఖ్యానము చదివినను
వినినను సర్వాంహోనివారణంబును సుఖప్రాప్తియు నయ్యెడి. మీరడిగిన సావిత్రీ
మాహాత్మ్య మంతయుం జెప్పితి. నింక నేమినుడువుదు”నని యనుటయు ఋషులిట్లనిరి.

మ॥ “అటు సావిత్రి సకోపయై చనినపై నాధాత గాయత్రి త
క్కటి యాదిత్యులు నేమిచేసిరి ? యుపేక్షం బూనిరా ? తెక యా
ర్భటి నేమేని పొనర్చిరా ? మఱియు శాపగ్రస్తులై వేల్పు ల
చ్చట నెట్లుండినవార ? లార్య ! కరుణన్ సర్వంబు వాక్రువ్వవే ” ౯౨౪

వ॥ అనియడుగుటయు సూతుండు ౯౨౫

—• గాయత్రి సావిత్రిశాపమును మరల్చుట. •—

కం॥ “ సావిత్రి యీవిధంబున దేవత లందఱిని బుర్వఁదిట్టిచనుటయున్
భావనయా గాయత్రీదేవి సరవిలేచి యంత ధృతి నిట్లనియెన్. ౯౨౬

క॥ "సావిత్రియన్నమాటను నేవిధమునసో యొనర్ప నెవ్వరివశమా.
దేవాసురులోకటుసుఁగా. కావాక్యము కార్యకారి యయియె తీరున్. ౨౭

సీ॥ భూరిపాతివ్రత్యమునకంతటికిఁగూడ ననపాయకరమైన యాశ్రయంబు
గలకపాథోనిధికన్యక మొదలైన తద్దేవతాంగనాతతికిఁ బెద్ద
స్వారాట్పురోగమ సర్వగీర్వాణులకన్వహం బత్యంత మగ్చనీయ
స్తవనీయతమములౌ సద్గుణంబులకెల్ల నబలాజనంబునం దగ్రగణ్య
యమ్మహాభాగ సావిత్రి. యాత్మధవుని దిట్టుటేలన నయ్యది స్త్రీస్వభావ.
మలఘువజ్రప్రహారంబునైనఁగాని సైఁచు నాడుది. సైఁపదు సవతికథను. ౨౮

ఉ॥ నాకొఱకై శపింపఁబడినారు సురల్ ద్విజవర్య. లట్టెను
శ్లోకుల ముప్పూర్వకయ మూచినఁజూడనియట్టులుంట యెం
తో కఠినంపుఁజేఁత యది. యోవిబుధాగ్రణులార! కావునన్
మీకిపుడేను శక్యమగు మేలొనరించెద సంతసింపుఁడీ. ౨౯

ఆ॥ వసుమతీసురాది వర్ణచతుష్టయప్రజ కపూజ్యుఁడనియె బ్రహ్మ నామె
ధర్మకర్మమెదియు ధరణి బ్రహ్మస్థానమునను బ్రహ్మలేక కనదు సిద్ధి. ౩౦

తే॥ కృష్ణునర్చనమున నేసుకృతముగలుగు లింగపూజను నెద్దిహాసంగుఫలము
సార్వకాలికబ్రహ్మదర్శనమువలన వచ్చు దానికిఁగోటిరెట్లధికఫలము. ౩౧

తే॥ పర్వకాలంబులం జేయఁబడినయట్టి బ్రహ్మదర్శన మత్యంతఫలదమగును.
డెందమందున సందేహమొందవలసినంతపని గావఁబడ దేతదర్థమందు. ౩౨

క॥ నీవును విష్వక్సేనా! యావిడయనినట్లు నరుఁడవైన నగుదుగా.
కావడిఁగూడఁ బరార్థమె సేవించెద వొరుల సొంతసేతకుఁ గాకే. ౩౩

ఆ॥ రెండురూపములంగ ప్రేపల్లె పావనంబొనరుపంగ వృద్ధినొందె దచట.
నొకటి కృష్ణనామ మొండర్జునాఖ్యమై ద్వివిధరూపములును దేజరిల్లు. ౩౪

తే॥ ఆ భవద్రూపమేదైన యర్జునునకు నలిపి సారథ్యమును బార్థసారథియని
పలుకఁబడిరియెడినీమీఁదఁ బ్రేమగలిగిన త్రిలును మానకీనాన్వహాయమెల్ల. ౩౫

శా॥ దానంజేసి సమస్తలోకదివిషత్సందోహసంశ్లాఘ్యులై
కానల్ మన్నిగ మండునాఁడును మదిం గష్టంబు భావింప కెం
తేనిం బాడియుఁ బంటయుం గలిగి హాయిన్ భూమి వర్తింతుర
న్యానశ్రీని మదీయవంశజులు విష్ణూ! నీదు సంగంబునన్. ౩౬

క॥ ఓహోహోశక్రా! నిను సాహసమున గెల్చి వైరు లాదటఁ గాదా
దేహంబునఁ ద్రోసెదరని సాహసమున నల్గి యనియె సావిత్రి వెసన్. ౩౭

ఆ॥ అపుడు బ్రహ్మ తాను యరుదెంచి వడినిన్ను బంధముక్తుఁజేయు భయముపడకు.
 మంతఁ జోరఁజొచ్చి యుపజయంబునుబొంద. వింతఁ శ్చయం బిఁకేమిభయము. ౯౩౮

కం॥ అన్నింటికిఁడి కాఁదుగ నిన్నును సావిత్రి గాలినెచ్చెలి! తిట్టెన్.
 నిన్ను స్పృశించినయంతన యన్నియుఁ బావనములగును నదులకు మింకన్. ౯౩౯

ఆ॥ స్వాహతోడసురల స్వధతోడఁబితరులం దనుపుదానమునీవు ధాత్రిలోనఁ
 బూజవడయఁగలవుపో హవ్యవాహన! మాయకీనవాక్యమహిమవలన. ౯౪౦

ఉ॥ రుద్ర! ప్రియావియోగమున రూపఱెదంచు శపించెనామె ని
 న్నద్రికుమారి గౌరియనునాయమ వెన్కటిభార్య కొప్కుడో
 భద్రగుణాఢ్య యింకనొకపంకజలోచన భార్యయై భవ
 చ్ఛిద్రములెల్లఁబోవణఁచు. చింతిల కింతయు సంతసింపుమా" ౯౪౧

 వ॥ అని శాపగ్రస్తుల కందఱికిని దన్నివ్య త్రిపూర్వకంబుగా వరంబులిచ్చి మరల
మౌనమవలంబించి కూరుచుండుటయు సర్వదేవఘులును ౯౪౨

—• దేవతలు గాయత్రిని స్తుతించుట. •—

కం॥ ఏతద్దేవినిగొలుతురు భూతలమున మనుజులింకఁ. బూర్వము ధాతన్
 బ్రీతుంజేసి పిదప నీమాతం బూజింప మోక్షమార్గము దొరకున్. ౯౪౩

కం॥ ఏవనిత మగనిఁగలసినయావల గాయత్రి శాశ్వ కభినందనమున్
 గావించునో యావనితకుఁ గావలసినయంతసంతు గలుగును జగతిన్. ౯౪౪

తే॥ వంధ్య దుర్భగ యమ్ము సేవనరుహాక్షి శ్రద్ధ గాయత్రి సేవించు సర్వకామ
 సౌఖ్యయుతయును ధనధాన్యసహితయును నయి ధరణిఁ జెలఁగెడినాయమ తప్పకుండ"
 వ॥ అని ప్రశంసించి"రనిసూతుండు వక్కాణించుటయును ౯౪౫

కం॥ గోదానాదికతోషిత భూదివిషజ్జనసమూహా! పోషితదీనా
 నాథాదికసందోహా! యాదవరగామనిర్మితాత్మసుగేహా! ౯౪౬

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తి
ముక్తాయమాన విద్వత్సభావిఖ్యాతావధానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సమాంధ్రీ
కృతంబగు శ్రీస్కాందమహాపురాణాంత
ర్గత నాగరఖండంబునందు
సప్తమాశ్వాసము



# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.
ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము
లును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కరిజేకోద్ధారిణి [పూలె వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 10 | సంగవోపానము ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 12 | పద్యాలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | 0 | 3 | 0 |
| 15 | పశ్యంపశ్యం ... | 0 | 2 | 0 |
| 16 | పశ్వశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర ... | 0 | 14 | 0 |
| 19 | సద్వ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము ... | 0 | 8 | 0 |
| 23 | మనుసంహిత-ఆంధ్రము ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | 0 | 4 | 0 |
| 28 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛాస్త్రులుగారు) | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరుజిల్లా.

౭ నారాయణరావుగారు, దాశారుపల్లె

౮ బేలూరి రామన్న గుప్తగారు, సదాశివునిపేట

౯ రాయమారి బండేరావుగారు, అయినాపురం.

౧౦ రామారి సుబ్బయ్యగారు – శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు – ముసలాపురం

౧౨ దండు గుండేరావుగారు, కరణము – ముసలాపురం

౧౩ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు – ముసలాపురం

౧౪ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౬ భాస్కరరాయుని వెంకటరామయ్యగారు, వంగపల్లి

౧౭ నరసింహస్వామివారు, యాదగిరి

౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౯ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ప్లీడరుగుమాస్తా, గురిజాల.

౨౨ చిక్కరాజు మట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౩ కవులూరి నరసింహారావుగారు, తాలూకాగుమాస్తా, వినుకొండ.

౨౪ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

౨౫ రావికొండ వెంకటరామయ్యగారు, యొనమదల

౨౬ కప్పగంతు సుబ్బారావుగారు – పోలీసుసబిన్స్పెక్టరు – పిడుగురాళ్ళ

౨౭ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు – హైదరాబాద్.

౨౯ కన్నయ్యగారి రంగయ్యగారు–ముసలాపురం

౩౦ చక్కిలం పాపయ్యగారు–ముసలాపురం

౩౧ తాళవలిమె లింగన్న మొకద్దంగారు–గడిపెద్దాపురం

౩౨ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి

౩౩ సుబ్బారెడ్డి దేశముఖుగారు, శ్రీగసాగరం.

౩౪ వంగరాజా గోపాలకిషన్‌రావు దేశముఖుగారు, హాపురం

౩౫ చిలుకుల శ్రీరామశర్మగారు– నాగులుప్పలపాడు

౩౬ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౭ కాకిరాల రామచంద్రయ్యగారు, మముడాపురము

౩౮ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు

౩౯ ఇటికాల రాజేశ్వరరావుగారు – వకీలు కంభంమెట్టు